# సూచన

ఈ ఖండకావ్యములు అప్పుడప్పుడు రచించినవి. కావున నిందు వస్తుభేదము గోచరించుచున్నది. అయినను, సహృదయులు లక్ష్యము నను మేయింతురు. కవికిఁ బందొమ్మిదేండ్లు నిండకపూర్వమివి యన్నియు రచింపఁబడినవి.

వీనిలో, ఒకరాత్రి (జాగ్రత్స్వప్నమను పేరుతోఁ) నామిత్రునకు, మురళీధ్వని (గానభంగ మను కథలో), నీరోపాట, ఆంధ్రకవిత, మేఘదూతము, మైనారిటీ వెళ్ళినరోజున, ప్రణయగీతిక; వెనుకటి పద్యములు కాల్చి, ఒక నాఁడు (ఈ రెండు 'రసాలమునుండి' అను శీర్షికతోఁ) "సాహితి" పత్రికయం దప్పుడప్పుడు ముద్రితములయినవి. తక్కినవన్నియు నిప్పుడే మొదటిసారి ప్రకటింపఁబడుచున్నవి.

# విషయసూచిక

# విషయసూచిక

సమర్పణము

# శివశంకరునకు

నావనమ్మున దోహదసేవ నీవు
సాదరమ్ముగఁ జూచు రసాలశాఖి
పుష్పఫలవంతమయ్యె; నేప్రొద్దు నిన్నె
స్మరణకుం దెచ్చుచున్నది సఖవరేణ్య!

పూలఱెక్కలతీరు గుచ్ఛాళిసౌరు
పరిమళంబు వికాస మేపగిది నున్న
పండ్లపరిణతి రుచియును వర్ణ మొరుల
కేగతి రుచించినను రుచియించుఁగాక
నీకు నామోద మొసఁగుట నిశ్చయంబు

ప్రేమగలవారి కిచ్చుట శ్రేష్ఠమనుచు
సర్పణము చేయుచుంటి నీ-కందుకొమ్ము!

# సంవత్సరాది

నెచ్చెలీ, యొక్కసారి కన్విచ్చి కనుము!
అధిక సంతోషమున నూత్నహాయనంపు
జీవయాత్రను గడపగా సిద్ధమైన
నెట్టి శుభసూచనంబు నీ యెదుటబడెనో!

ప్రకృతికాంత వసంతదర్శనము కలుగఁ
బ్రియుని సంప్రీతితో నాదరించు కొఱకు
చిగురు చీరె ధరించి విచ్చేసె నెదురు!

తరలిపోయిన పూర్వవత్సరముతోనె
సౌఖ్యహీనత యేమున్న సాగనంపు!
అభినవాబ్దము క్షీణించి యరుగుకొలఁది
శుక్ల శశికళలను మీఱు శోభఁజెందు!

# ఆశీస్సు

ప్రకృతి కుసుమాంగి తన దివ్యభవనమందు
వివిధమృగ పక్షి జాతులన్ పెనోబట్టి
మనురగానంబు సలుపు రమ్యంబుగాగ
పూర్ణచంద్రుండె యామను ముద్దు మొగము
సాంద్రచంద్రిక లామెహాసంబు, లసిత
జలధరంబులు చూర్ణ కుంతలగణంబు,
కాలగగనంబు సుందర కైశికంబు;
చారువిస్తార కేశపాశంబునందు
మణి విధంబున సలదినమణి వెలుంగు!

అఖిల మృగములు రమ్యనృత్యము ల సేయు
కీరపికములు మంగళగీతములను
హృద్యముగఁ బాడుఁగావుత మెప్పుడు నీకు!
మత్తబంభర వరములు మధురమైన
ఝూంకృతులతోడ నతుల నొసంగుఁ గాక!
సంతసంబొంది మిగుల వసంత రాజు
దృష్టిపథమున మకరంద వృష్టిఁ గురిసి

సుమరజంబును వెదజల్లి సుందరముగ,
మంజరీ మనోజ్ఞనికుంజపుంజములను
వర్తులాకారముగ నూర్ధ్వ భాగమందుఁ
బ్రీతితోఁ దీర్చి కడు గారవించుఁ గాక !
సింధువు తథాస్తటంచు ఘోషించుచుండఁ
దటిని తెల్లను మర్మరధ్వానముల
సంతతాశీరవంబులు సలుపుఁగాక !

అభినవంబైన లోకమునందు నీవు
సంచరించుచు నుంటి వీసమయమందు
మధురగానామృతలహరీ మజ్జనంబు
సలుపుచున్నాఁడ వేమియుఁ దెలియకుండ
బాల తృణతల్పములమీఁదఁ బవ్వళించెదు,
పరువు లిడుచుండుటయే గాని విరతి లేదు:
విరతియేటికి నాయాస మెఱుఁగనపుడు?

ప్రకృతి సౌందర్యములు సర్వకకుభములను
నెగడి, మూర్తీభవించి, కాన్పించుచుండు;
ఎంతద వ్వేగుచుండిన నిటులె యుండు!

# ఆంధ్ర కవిత

అమల రత్న వినిర్మిత హర్మ్యములను
లలిత సౌరభ విలసితారామములను
కౌముదీస్నిగ్ధ కమనీయ యామినులను
నాట్య శబ్దాభిశోభిత నగరములను
స్వచ్ఛ పద్మరాగారుణస్థలములందు
తామరసరమ్య కాసార తటములందు
నించు వేడుకతో విహరించినావు !
కంటక మయంబులౌ ఘోర కాననముల
సమధి కోత్తుంగ వింధ్యాది శైలములను
చండ తేజస్వి నూష్మకసమయసూర్య
రక్తవర్ణంబులౌ సాంధ్యరాగములను
దృష్టినొందితి భవదీయ దృష్టిఁ బఱపి !

నన్నపార్యుఁడు మొదలు సూరన్నవఱకు
సన్నతస్థానము వహించి యుంటి వీవు.
ప్రౌఢల దుష్కాలమంత సంప్రాప్త మయ్యె
శ్లేషచే గర్భకవితా విశేషమునను

జిత్రబంధ పరంపరఁ జిక్కినావు !
ప్రకృతికమనీయభావము స్వప్నమయ్యె !

కష్ట దివసమ్ము లెట్లెట్లొ కడచిపోయె.
యుష్మదీయేచ్ఛకు నిరోధ మొదవ నీక
నూత్న రమ్యస్థలంబులు నూత్న గతులు
నలవడంజేయ నున్నవా రనుఁగు సుతులు

అఖిల వాక్కాంతలందు నుతార్హ పదవి
ఆంధ్రి కవితామతల్లి, నీ వందఁ గలవు !

## మనుచరిత్ర మొదటిసారి చదివి

కాంచితి నే మహోన్నత నగంబుల
    నెన్నియొ, స్వచ్ఛమేఘ బిం
ద్వాంచిత దివ్య జహ్ను తనయాది
    స్రవంతుల మజ్జనంబు కా

వించితిఁ, గ్రూరవన్య మృగభీకర
  దుర్గమ కాననంబులం
దించుక కష్టమేని భయమేనియు
  నొందక సంచరించితిన్.

అతి గణనీయమై వెలయు నచ్ఛ
  మణిప్రకరంబు గొల్లగాఁ
బ్రతిపద కీర్ణమానమయి భాసిలు
  కుట్టిమ భూమిఁ గిన్నరుల్
రతనపుఁ గంబళంబుల విరాజిలి,
  పీణల మీఁటుచుండు శ్రే
ష్ఠతమము లైన హర్మ్యముల
  సౌఖ్య మనంతముగా వసించితిన్.

రమణీయంబగు రక్తకాంతి దిశ
  లెల్ల న్నిండ సూర్యాస్తమా
నమె గాఁబోలని పల్లవంబులు భ్రమ
  గల్పింప, నక్షత్రముల్
తమ నాథుం గవ గూడ వచ్చెననఁ
  బూలం బూచి యున్నట్టి చూ

తములందు న్వసియించి యాప్రకృతి
 సౌందర్యంబు వీక్షించితిన్.

ఒక్క మృణాలమందుఁ గులుకొప్ప
 వసించి, సమీప పద్మమున్
ముక్కుఁ గొన న్విలాసముగ మూర్కొను
 చిట్టులు సల్లుఁ జిమ్ముచుం
బ్రక్కనె మందయానమునఁ బోలు
 మరాళముఁ బిల్చి గోష్ఠిలోఁ
జిక్కెడి చక్రముందు సరసీ
 తటమందు షికారు చేసితిన్.

చటుల ఝరీనినాద ప్రతిశబ్ద
 మనోహర హేమభూమి భృ
త్కటక గుహాంతరస్థితనికాయ్య
 నికాయ నివాస సౌఖ్య ప్రా
కట రుచిరాస్వరో మధురగాన
 సుధారస సేచనంబునన్
స్ఫటిక సమాన నిర్మలత
 స్వాంతము భాసిలుచున్న దియ్యెడన్ !

# నా మిత్రునకు

హృదయఫలకంబు భావవిహీనమైన
స్వీయశక్తి ప్రదర్శన సేయుకొఱకు
వాంఛితార్థ సంసిద్ధిని బడయుటకును
మాటకోసము గౌరవమాత్రమునకు
తగుదువే కాని, యిపుడు రాదఁగవు కాదు!
కంఠదేశస్థ వాతము కంపమొందు
స్వరములెల్లను గడు నపస్వరములగును
అంత, మాధుర్యమంతయు నంతరించు
వేణుగోపాలకృష్ణుఁ డనూనకీర్తి
యుతుఁడై నావల్ల నపయశం బొందగలఁడు
స్తోత్రపాఠము, దవ్వుగాఁ దొలఁగిపొమ్ము!
బాలకృష్ణుఁడు వ్రేపల్లెవాడ కదలి
ఆలమందలఁ గొత్తబయళ్లఁ ద్రిప్పి
వేణునాదంబు వీనుల విందు చేసి
యందు నభిరుచి పుట్టించి యజ్ఞులకును
అల్పవిదులకుఁ బాండిత్య మబ్బఁజేసి
తృణసమృద్ధి కలిగినచోట్ల నెల్లయెడల

ఇంపునింపు ధ్వనుల్ ధ్వనియింపఁజేసి
సకలగోపాల హితబృంద సహితుఁడగుచు
ఎపుడు తృణజలధాన్యసమృద్ధి నెసఁగి
సంతసం బిచ్చు మాపల్లెచెంత విడిసె.

విడిసి పిల్లనగ్రోవిని బెదవులందు
లీల మోఁదాల్చి గానసుధాలహరిని
అందఱిని ముక్కలిడఁజేయు నంతమున్నె
వానికీర్తి రవిద్యుతుల్ వచ్చినన్ను
నిదురపోయెడి వానిని నిదుర లేపె.

మొలఁకువ లభించినంతనే తెలివి వచ్చె
తోడనే యిట్లు తలపోయఁ దొడఁగినాను:
తోడివారెల్ల నావలఁ దొలిక్కుమనిరి
పేరుగలవారు పెడచెవిఁ బెట్టినారు
మురళి చేబూనుటే రాదు, ముద్దులొలుక
గాన మొనరింపఁ జూచు టెక్కడిది చోద్య
మనుచు నెల్లరుఁ బలుకఁ నిరాశఁ జెంది
అంధకారమునందు నల్లాడు చుండ
మార్గమును జూపు నీకాంతిమహిమ యేమి!

పోయెదనుగాక యెటకుఁ గొంపోవు నటకు
ననుచుఁ దలపోయుచుండెడి యంతలోనె
అప్రయత్నముగా యశోదాత్మజాతు
ముందు నిల్చితి.

కృష్ణుఁడు మురళిఁబూని
మేఁత చాలించి గోవులు ప్రీతి వినగ
పడగ లెత్తి యహుల్ పరవశత నాడ
నడచు పాంథులు నాలించి నిలువఁబడగ
తరువులును హర్షవశమునఁ దలల నూప
కరగి కాల్వలు గట్టఁ గఠినశిలలు
జడి గొనంగ నానందబాష్పములు నాకు
నాద మొనరించి చాలించి నన్నుఁ జూచిఁ
స్వేచ్ఛఁ జరియింపుమా, త్రెంపి శృంఖలములు
వేణు వూదుట చాలించివేయ! కనుచు
ఇట్టు లుత్సాహ మొసఁగి యదృశ్యుఁడయ్యె.

నేను బిమ్మట స్వప్నమో నిజమొ యనుచు
సంశయాశ్చర్యములతోడ సంభ్రమించి
చిత్తమం దిదియెల్ల నచ్చొత్తినట్లు
కానిపించుటచేఁ గల కాదు, నిశ్చ

యము గ జాగ్రదవస్థయే యనుచు నెంచి
మురళిపై గాన మొనరింపఁ బూని నాఁడ.

కానఁ, గర్ణకఠోర నిస్స్వానములను
జేసి నేనె యపఖ్యాతి చెందిచెడను.
యాంధ్ర వాఙ్మయ తిలకుని యశము కొంత
మలిన మొనరింతునో యని కలదు భయము.
వేణుగోపాలకృష్ణ, నీగాన మొక్క-
మాటె యాలకించితి నైన మఱవఁజాల
నప్పు డుద్భవిల్లిన మహాహర్షసుఖము!

నన్నుఁ బలుమాఱు గానంబొనర్ప వినుట
కయి కుతూహల మున్నట్లు లడిగి నావు
యుష్మదీయ కుతూహలం బస్మదీయ
భావములు నిప్పు డేకభావము వహించె
అందుచేఁ గర్ణపేయమో, యట్లుకాక
కర్ణభేదకమో యెఱుఁగంగ రాదు;
ఎట్టులైనను జింత యొకింత లేదు.
ఆలకింపుము నాగాన మాలకింపు!

# కృష్ణాతీరమున

నిర్మల విశాల గగనంబు సాంధ్యవేళ
రాజవిజయుంబుచే నలంకృతము గాగ-
ప్రకృతి రమణీయ హరితవస్త్రంబుగట్టి
మంజుమంజీర మధుర నిస్స్వానముతోడఁ
బ్రియుని దర్శించుమతిఁ ద్రిపామంథరముగ
కృష్ణవేణమ్మ ముందటఁ గదలుచుండ;
దూరమున నున్న యున్నతస్నిగ్ధగిరులు
హృదయమును మిన్నుముట్టఁ గొంపోవుచుండ;
నూత్నకల్యాణమోద సంభరితుఁడైన
మిత్రునకు నంగన లొసంగు మంగళముల
మంజుల రవంబు శ్రవణముల్ నింపుచున్న;
శాంతి నొసగూర్చు నేకాంత భూమి నున్న
మృదుల పవన తరంగముల్ మలయుచున్న
ఏలనో కాని మోదమే లేకపోయె!

# మైమఱపు

అభిముఖంబుగఁ గృష్ణకు నరుగుచుంటి
కాఱు మబ్బులు వినువీధిఁ గ్రమ్మియుండె
సూర్యభగవానుఁ డింకఁ గాన్పించలేదు.

ఎచ్చటను లేని యుల్లాసమును వహించి
మందమలయానిలుండు పై మలయుచుండె
అతివిశాలాంబరాలింగనంబునందు
నిమిడియుండె సమున్నత పర్వతములు
అవలి తీరంబునను సచేతనములట్లు.

నడచుచుండగ నాకస్మికముగ నేను
విరివిసైకత మొకదానిఁ జేరఁగంటి.
అందుఁ దొలియడుగిడిన జీవుండ నేనె
యంచుఁ దోఁచెను; తోడనే హృదయమందు
చెప్పలేనట్టి సంతోష మావహిల్లె.
ఏమియును దోఁచ కప్పు డాయిసుకతిన్నెఁ

బ్రీతితోఁ గౌఁగిలించి, కృష్ణాభవాని
నెంచి యిట్లని ధ్యానింపఁ దొడఁగినాఁడ:

“తల్లి, నీవెంత సౌభాగ్యవతివి ! మిగుల
సుందరాధ్వంబు వెంట ముందరికిఁ జనెదు.
ఎట్టిచోటులు నీముఖదర్పణమునఁ
బ్రతిఫలించుచునుండునో, ధన్యవీవు !
సమధికారోగ్య రసపూర్తి నున్నవేళ
ఇపుడు నే నున్నచోటి వస్తువులనెల్లఁ
జన్ని నీయూర్మికరముల నెత్తిపట్టి
లీనమొనరించి నీలోన, నీవు పోవు
చోటులను జూపి, యందందుఁ ద్రిప్పుచుండు.
అట్లు ననుఁగూడఁ ద్రిప్పి ముదంబుఁ గూర్పు
మింతకంటెను వేఱు కోరికలు లేవు !”

ఇట్లు ప్రార్థించి నిర్భరానందమునను
గంతు లిడి, కేక లిడితి, నా సైకతమున.
తుదకు నొకచోటఁ గూర్చుండి వ్రేలితోడ
నిసుక వ్రాసితి జేతికి వచ్చినట్లు.

ఇంతవఱకును నాకనుల్ గ్రమ్మియున్న
స్వచ్ఛసంతోష యవనిక జాఱిపోయె.
ఆకసంబును దలయెత్తి కంటి, నందు
సూర్యుఁ డున్నట్టిజాడ కన్పట్టలేదు.

ఆత్మగేహంబునకు నేఁగి యూఁగయుపిదప
సూర్యుఁ డప్పుడె క్రుంకె నం చెఱుఁగనయ్యె.

## శూన్యత

మాట రాకున్న దిప్పుడు నోట నాకు
కనులు విచ్చియె యున్నవి గాని కనవు,
హస్తచరణంబు లేస్థితియందుఁ గలవొ
కదలుచున్నది, కదలకున్నదియు నెఱుఁగ!
మానసం బున్నదో లేదొ మాయమగుచు
నెచ్చటికి నేని బరుగెత్తెనేమొ యెఱుఁగ.
మదిని మండించు కోపము మాటలేదు,
హృదయ మార్ద్ర మొనర్చెడి ప్రేమ లేదు
కష్టమైనను, సుఖమైన గాని లేదు!

# మేలుకొలుపు

పక్షిసంతతి తిరుగఁ జొచ్చెను
ఋక్షగణము లదృశ్య మయ్యెను
ఈక్ష్మాతల మెల్ల మేల్కొనె
పక్ష్మ నులుముకొను !

కనక వర్ణితమైన గగనము
క్షణము క్షణమును శోణమయ్యెడి
తెనుఁగు భూమి వెలుంగఁజేయుచు
ఇనుఁడు పుట్టె నదే !

గొంతు బాగొనరించుకొనుమా
గంతు లిడుము భుజించి త్రాగుచు
వింత చిగురుల ఫలరసంబుల
వంతులేకుండన్!

# ఉద్బోధము

భాషతో నాకు వర్ణింప వశము కాని
ముదము పొందుచునుంటి సముద్రపు దరి
పాదముల ముంచుటకు దూకిపడెడి యలల
శూన్యభావంబుతో నేను జూచుచుంటి.
చూడఁ జూడగఁ గ్రమముగాఁ బ్రకృతియెల్ల
నెట్టయెదుటనె పొడకట్టి నట్టు లయ్యె.

అచట నున్నది పూజ్యమా చక్కదనము
జాలి కల్గించు వికృతపు రూపు గూడ
అంతులేనట్టియాశ సంపూర్ణతృప్తి
నిర్మలత్వంబు మలిన సంపూర్ణతయును
మాన్య గంభీరభావము లొల్లితనము
సరస విరసంబు లున్నవి, కలిమిలేము
లెచ్చుతగ్గులు నున్న విదేమివింత!

కనుల యెదుటనె లోకవిధంబులెల్ల
కానఁబడుచున్న వనుచు నబ్బురముతోడ
నేమి తోఁచక వెనుకకుఁ జూడ నచట

రాగసంపూర్ణుఁడై యస్తమింపఁ జనెడి
సూర్యభగవానులో సముద్రమ్ము నందుఁ
జూచినదియెల్లఁ గనులకుఁ గానిపించె.

'ఏమిరా యిది!' యంచు గన్నెత్తి చూడ
పలువిధంబుల మేఘముల్ కానవచ్చు
నంబరస్థలమునఁ గూడ నదియె కంటి.
మలయ పవమానుఁ డింతలో మసలె మీఁద
ఆకసంబునఁ గాంచిన దందుఁ గంటి.

అంతఁ క్రిందికిఁ దల త్రిప్ప నపుడు నేను
గూరుచున్నట్టి సైకతంబునను గూడ
సంద్రమున సూర్యులో నాకసమ్మునందు
ముందుఁ జూచిన వింత వీక్షించినాఁడ.

ప్రతిసికత రేణువందును బ్రకృతియెల్ల
మూర్తిఁ బొంది కనంబడినట్టు లయ్యె.

ఎల్లచోటుల దీని వీక్షించి విస్మ
యాకులాత్ముఁడనై పిచ్చివాఁడు వోలెఁ
గలయఁ జూచితి దిక్కుల. నేదికన్నఁ
జెట్టులో గుట్టలో కాలి బాటలోన

సౌధతలముల నుద్యాన వనములందు
నటులనే కంటిఁ బ్రకృతి రూపంబు లెల్ల.
ఎట్టి మహనీయలోకమో యిది యటంచు
హృదయ మాకాశ వీథిలో నెగురులాడె.
ఒక టొకటి పుట్టి చుక్కలు మబ్బులోన
తొంగి చూచుచు దోబూచు లాడుచుండె:
వానిలోఁ గూడఁ బ్రకృతిసర్వంబు గంటి.

తూరుపునఁ బుట్టుచున్న బంగారు చంద్రు
నందు నదె చూచి యాశ్చర్యమొంది యంత
జాదరి బింబమువంకఁ దదేకదృష్టిఁ
జూచుచుంటిని; బంగారు చందమామ
వెండి చంద్రుఁడుగా మాఱె; నందుగూడఁ
జూడఁ గల్గితి నన్ని విధాల ప్రకృతి.

క్రొత్త సత్యం బెఱింగి యాచ్చెరువు తోడ
నూతనం బైనహృదయ భారంబుతోడ
నాత్మగేహాభిముఖుఁడనై యరుగునాకు
దారిలో నేదికన్నను దానియందుఁ
బ్రకృతి రూపములెల్లఁ బ్రస్ఫుటము లయ్యె.

జోరు పిట్టలు శయనించు గూటియందు
గ్రామవీధుల నిండిన శాంతమందు
పండువెన్నెలఁ దిరుగు దంపతులయందు
చేరి తుదకు నాపేదకుటీరమందు
ఇంతవరకును జూచిన దెల్ల గాంచి
చోద్య మొందుచు నన్ను నేఁ జూచుకొంటి.

అచ్చెరు వేమి చెప్ప ! నాయందుఁగూడ
సంద్రమున సూర్యులో నాకసమున గాలి
సైకతంబున నిసుకను సర్వదిశలఁ
జుక్కలను, జందమామలోఁ, జూడవచ్చు
పక్షిజీవంబులోన వెన్నెలలలోన
ఊరిలో దంపతులలోఁ గుటీరమందు
స్థిరపడిన గొప్ప ప్రకృతి చిత్రంపురూపు
కానగా వచ్చె-నాలోన కానవచ్చె.

ప్రత్యణువునందు సైతము ప్రకృతియెల్ల
నిమిడియుండుట యిప్పుడే యెఱిఁగినాఁడ
ఇంతవఱకును బుట్టంధువట్టు లుంటి !
ప్రకృతిమహనీయరూప మెల్లెడలఁగలదు
కనులు గలవారు మాత్రము కాంచఁగలరు !

# బూచి

మేలి నీలాంబరపుఁ జాయ మేనివాఁడు
ముద్దు లను మూటగట్టెడి మోమువాఁడు
ఆఱుసంవత్సరంబుల యర్భకుండు
ఒక్క మైదానమునఁ గేళినొప్పియుండె.

అప్పుడే మొల్కలెత్తెడి నచటి తృణము
దానిపై దూరమున నున్న తరువు నుండి
మఱ్ఱి మొదలగు నాకులు మఱియు దెచ్చి
వైచుచుండెను వాయు సంవాహకుండు.

ఎండుటాకులు ద్రొక్కుచు నెగిరి యొసఁగి
చిన్నవాఁ డుండుఁ దనచిన్ని చేతి వ్రేళ్ళ
జేటి మాటికిఁ గుసు లెగఁ జిమ్మికొనుచు
గుప్పలుగ గొన్ని పర్ణముల్ గూర్చుచుండె.

పొరివుచేసెడి యాకుల ప్రోవునందు
ఏదియో చక్కనగుపిట్ట యీఁక యొకటి

కానఁబడ నాక్షణంబున దానిఁ బూచి
బూచి' యంచును జేపట్టి లేచె నతఁడు.

చేతఁబట్టిన యాయీఁక చిన్నతునక
ముద్దునోటను బైకి ఫూఫూ యటంచు
నూఁదె; నైనను గాలి లేకుంటఁజేసి
ఎంతసేపటికోగాని యెగురదయ్యె.

గాలి దానిని జేకొన్న క్షణమె యతఁడు
ఊఁదుటాపెను; నోటితోఁ నూఁదు టింక
వ్యర్థమగునంత యున్నతభాగమునకు
వాయుసంవాహకుండు కొంపోయెదాని

పైనభంబున కేఁగు విమానమువలె
అనిలు భంగకరంబుల నపుడు బూఁచి
మెల్ల మెల్లగ సొగసుగా వెళ్ళుచుండ
బాలుఁడును దానిఁ గని వెంటఁ బరుగు వాఱె

బూచి పై కేఁగుఁ నింతలో భూమిమీఁదఁ
బడెడికీలిని గాన్పించు బాలకునకు

పట్టుకొనగను మరలను బైకి నూద
వశము గాకుండ నెత్తున బరుగు లిడుట.

పర్వదినమున నధిలోఁ బడవవోలె
ఒరగు లాడుచు వినువీధి నరుగు బూచి
పోయిపోయి యొకానొక పూల పొదను
విచ్చి విచ్చని మొగ్గలోఁ జొచ్చి నిలిచె.

బుడుతఁడుఁ గూడ నది ముందు పోమి యెఱిఁగి
పూవులోఁ జిక్కుకొనియున్న బూచిఁ గాంచి
వాని విడఁదీయ లేక పుష్పమ్ము గోసి
రెంటి నేకముగాఁ గూర్చి మింటవిడిచె.

కొంతవడి కాకఁ గొంతయో కూర్మితోడ
నొంటనే యేగి యవ్వాని వృత్తములను
దెలిసి కొనుచుండె నింతలోఁ దీవ్రపవను
డతని కవి కానఁబడకుండ నటకు గొనియె

వాని కాబూచి పూలు కన్పడక పోవ
పిల్లఁ డవ్వాని బూర్తిగా విస్మరించి
మఱియు వేర్వేరుక్రీడల మనసు పుట్టఁ
దరియుగాఁ బోయె మొదటి మైదాన భూమి.

# నీరో పాట

మండు భగభగ రోము పురమూ
మండు భగ్గున రాజధానీ
మంట చూచిన నాదు తను వు
ప్పొంగి పోయెడిని!

చిట చిటా దూలాలు చీలిచి
సురసురా యని చూరు లంటీ
పటపటా పగిలించి గోడలు
భగ్గు మనిపించు!

మేడ వెంటనె మేడ నంటును
వీధి వెంబడి వీధి రగులును
ఊరి నంతా భగ్గు మని ని
ర్మూల మొనరించు!

ఒక్క పురుగును మిగుల నీయక
మెక్కుమీ నీ కడుపు నిండా

లెక్క లేనే లేదు సీజరు
మొక్క దాన మను!

మ్రింగుమీ యాధనికు హర్మ్యము
మ్రింగుమీ యానాట్యశాలను
మ్రింగుమీ యాంకావ్యభవనము
మ్రింగు సర్వమ్మున్!

అల్లదే నిం గనక బడిలో
పిల్లలెందరో కలరు వారల
బుల్లి మేనులు ప్రీతి సురసుర
బుంది యొనరించు!

ఆసభాస్థలి సభకుఁ గూడిన
దేశ దేశాగత జనమ్ములు
చూసి నిం బ్విడక మునుపే
రాసి కావించు!

ఆజ్ఞకై తమ జీవముల నా
కమ్మి వేసిన వీరకోటుల

గుడిసె లవియే దాన మిచ్చితి
కూల్చు మవి యెల్లన్!

ఆరిపోవకు మారిపోవకు
మారు నస్మన్మోద దీపము
ఊరూ నీ పెనునోటఁ బడువఱ
కారి పోవకుమీ!

మండు భగ భగ రోముపురమూ
మండు భగ్గున రాజధానీ
మంట చూచిన నాదు తను వు
ప్పొంగి పోయెడిని!

## తొందర

కఠినవాక్యమ, నీ కెంత కఱకుఁ దనము
నిర్దయాశ్లిష్టమతి వయి నిముషమునను
కోమల ప్రేమబాధముల్ కోసివేతు!

ఆలుమగల దివ్యామలినైక్య మైన
భేద మెఱుఁగని సోదర ప్రేమనైన
సాటిలేనట్టి మిత్రుల సఖ్యమైన
తల్లి దండ్రుల మృదుల వాత్సల్యమైనఁ
దుడిచి వేసెడి నీచేతి దుడుకుదనము
దాళఁగాఁ జేయుశక్తి యీధరణి లేదు!

అద్దపు స్నిగ్ధమునఁ దనరారు కొలను
గాఢ ఝంఝానిలము వీచి కలఁచి వైచి
ఆకులలమును దేలించునట్టు లందు
మలినముగఁ జేతు మనసును గలఁత పెట్టి!

కొండపైనుండి యొక పెద్దగుండు దొరలి
పాదతలమునఁ బచ్చిక బయలి మీఁద
శాంతముగ మేయునావును జదియఁజేయు
విధముగా గుండె లగలించి వేతు వీవు!

చిగురునం బూల నిండిన చిన్ని చెట్టు
కావునకు సిద్ధమోఁ కాయఁ గడఁగుదాని
గుప్పునం బిడుగట్టులు గూల్తువీవు!

# ఒక రాత్రి

తళుకుఁ జుక్కలు మేఘావృతంబు లయ్యె.
కనఁ బ్రియమ్మింపగాఁ గ్రుచ్చుకొనెడిరీతి
నంధకారమె జగమెల్ల నావరించె.

వర్షభయమునఁ దమ నులవాటు వదలి
మనుజు లనకను బశుపక్షిగణము లనక
వెడలినవి జీవకోటులు విశ్రమింప.

జనఘనాకీర్ణమైన పట్టణమునందు
విపుల వాణిజ్యవంతమౌ విపణి కూడ
నిర్జనంబైనరీతిఁ గాన్పించుచుండె.

శ్వానముం గాంచి జాతివైషమ్యముననో
పురుషునిం జూచి తస్కరబుద్ధితోనో
మొఱిగె గొంతెత్తి శునక మొండరుగుమీఁద.

అట్టి బాహ్య ప్రపంచమధ్యమ్మునందుఁ
బొద్దు చనెనని నిద్రింపఁ బోవుచుండ
మన్మనో వీథి తొలుత నిర్మలినమయ్యె,
సుషిమ మయ్యెను భావనాశూన్య మయ్యె.

ఈ విధంబున నుండగ నింతలోనె
పూర్వపరిచిత మగు ముద్దు మొగ మొకండు
సాంధ్యతమమునఁ బోలె నస్పష్ట సరణి
నక్షియుగ్మంబు నెదుటఁ బ్రత్యక్షమయ్యె.

ప్రస్ఫుటం బయ్యెనట్లు కన్పడిన ముఖము
మెల్లమెల్లన దానికి మేను కూడె
హస్తచరణాద్యవయవంబు లన్ని యమరె
ఇష్ట మగునొక్కమూర్తియై యెదుట నిలిచె.

కదలిక జనించె నప్పుడా పెదవులందు
ఏదియో వినవచ్చెనో లేదొ యెఱుఁగ.
ప్రణయ వాక్కులఁ దనిసితి నని తలఁచితి
పల్కు లేవియొ యిప్పుడు పలుక లేను.

ప్రియసురూపంబుఁ గాంచఁ జాలితి నటంచు
ముదముతో నాదుహృదయ ముప్పొంగెఁ గాని
ఒక్క ప్రియ వాక్యమును బల్కనోపనైతిఁ
జేరఁబోఁ జాలనైతి, నా చిత్రమేమొ!

వల దటంచును వారించువారు లేరు
ఈయశక్తికిఁ గారణం బేమి యనుచు
యత్న మొనరించి కొంత ధైర్యంబు పూని
దగ్గరకుఁ బోవ నడుగు కదిల్చినాఁడ.

అపుడు క్రొమ్మించు మెఱసినయట్లు మూర్తి
తాను మును వచ్చిన విధాన తక్షణంబ
దృష్టి మార్గమునుండి యదృశ్యమయ్యె!
అంధకారమె యెల్లెడ నావరించె!

# కలాశాలనుండి సహపాఠకులతో బహిష్కృతి నొందినరోజున

దైవవరమైన స్వాతంత్ర్య జీవనమ్ము
పోరి రక్షించు కొనఁగల్గు పుణ్యమబ్బె!
మూర్ఖభుజశక్తి నొక పెడమూలఁ ద్రోసి
న్యాయబలమున భారమంతయును వైచి
స్వార్థము హరింప నెంచెడి బందిపోటు
భంగ మొనరింపఁ గల్గు సద్భాగ్య మబ్బె.
వ్యర్థవాదంబు సల్పి జిహ్వాశ్రమంబు
గల్పనము చేసికొనువారు కాని కారు
తలఁచు కార్యంబు శివుఁ డడ్డపడినఁ గాని
సఫల మొనరించు కొనెడి యసాధ్యులనుచు
జగతిఁ బ్రకటింపగా నవసరము వచ్చె.
మాతృసేవకులై తమచేతనైన
దెల్ల నాబాలగోపాల మెల్ల ప్రజలు
సాయ మొనరింతు రని కార్యసమ్ముఖమునఁ
బ్రచుర పఱచుట యిపుడు ప్రారంభమయ్యె.
ఎంతపుణ్య దినమ్ములో యీదినములు!

## ఆశాభంగము

ఎక్కడి నిదాఘ, మభ్ర నిరీక్షణం బ
దేడ, గొంతెమ్మకోరిక లేటి? కనుచు
మేఘ దర్శనేచ్ఛను దిగమ్రింగి వైచి,
యెండకాలము నెల్ల నెట్లెట్లొ గడపి,
వచ్చుఁ దొలకరి వెంటనే వచ్చు హితుఁడు
సంశయము లేనె లేదని సంతసించి
స్వీయ కేదారమును బాగుచేసి మిగుల
నాఱుమడి దున్ని వ్యవసాయదారుఁ డొకఁడు,
"ఎపుడు మేఘుఁడు దయసేయు, నెపుడు కరుణ
నమృత బిందువులను జిల్కు ?" నంచు నెంచి
ఎంతయో తమితో నిరీక్షించుచుండ
హాలికానంద దాయియా నంబుదుండు
దూరముగ ముందుఁ గాన్పించి చేరవచ్చె.

వచ్చె జీమూతుఁ డని కృషీవలున కపుడు
కోరికలు క్రేళ్ళుదాఁటె విస్తారముగను

జీవన మొకింత చిక్కెనో చిక్కలేదో
మెఱుపు మెఱసిన విధమున మేఘుఁ డపుడె
దృష్టిపథముననుండి యదృశ్యుఁ డయ్యె !

# అ ధః ప త న ము

ధాత్రిసుఖసూత్ర సంబద్ధ తనుఁడ నగుచు
సర్వలోక సుఖంబులు వదలుకొంటి !

దివ్య గంగాజలస్వచ్ఛ దీర్ఘికలను
స్నాన పానాది కృత్యముల్ మానివేసి
చేరినాఁడను విధిలేక చెఱువు దరికి !

అమృతభోజనమును విడనాడి యిప్పు
డాశపడుచున్నవాఁడ శాల్యన్నమునకు !

సరస కనకాబ్జ వాయుప్రసార సుఖము
కల్పవృక్ష ప్రసూన సుగంధ సుఖము
పారిజాత పరీమళ పరమసుఖము
ధారుణీ వాసనలకుఁ బోఁడఁటిమినాఁడ !

# నిర్యాణము

మెడవంగి కీళ్ళెల్లఁ బడిపోవుచున్న
మూఁడేండ్లు నిండని ముద్దులబిడ్డ
నొడిలోన నిడుకొని యొక ముసలమ్మ
కనుల వెంబడి నీరు కార్చుచు వాని
మాటి మాటికిఁ బిల్చి మాటలాడింప
నవ్వింప నేడ్పింప నానావిధాల
యత్నించుచున్నది; యచ్చట నింక
చెదరిన జుట్టును చెరిగిన బొట్టు
కాటుక చెక్కులఁ గాఱి వ్యాపింప
కడుపుదుఃఖము తాను బడఁజాలనట్లు
ఒడ లెఱుఁగక యేడ్చుచున్నట్టి యువతి
అప్పుడప్పుడు లేచి యాపిల్లవాని
"నాయనా, నాయనా, నావైపు చూడు !
అట్లు చూచెదవేమి అయ్యో నాతండ్రి !"
యనుచు దుఃఖము వెళ్ళనాడుచునుండె.
ముద్దు లొల్కెడి చిన్ని మోమెత్తివాఁడు
ఊ యంచు మూలిగె నోపిక లేక.

ఇంతలో ముసలమ్మ యేకపుత్రుండు
ముఖమున దుఃఖంబు మూర్తీభవించి
కనుల వెంబడి బొట్లు కట్టి కాఱంగ
పిల్లవానిని జేరి ప్రేమతో నిట్లు
“అబ్బాయి, కన్నెత్తి అమ్మను జూడు”
మనుచుండె. బాలకుఁ డత్యంతబాధ
నడఁచుచు నున్నట్లు మెడ కొంచె మెత్తి
ముద్దు కన్నులు విప్పి ముత్యాలు కార్చి
మూల్గి ఊ యంచును మూసె నేత్రములు.
కన్నీటి బిందువుల్ కాఱెఁ దండ్రికిని
తల్లికి గుండియల్ దడదడ లాడె
హృదయాన ముసలమ్మ కదియించె బిడ్డ.

అంతకంతకు బిడ్డ యాననంబునను
కాలపక్షము చంద్రు కళలవిధాన
సహజమా కాంతులు జాఱంగఁజొచ్చె,
కాఱుమబ్బు ముఖానఁ గ్రమ్మినట్లయ్యె;
వైద్యునిఁ బిల్వగా వడి నేఁగెఁ దండ్రి.
వైద్యునితోఁ దండ్రి వచ్చుచుండంగ
‘నాయనా’ యను పెద్ద నాదంబు వెడలె.

వడవడఁ బాదముల్ వడఁకుచుండంగ
పరుగున లోనికి నరుగునప్పటికి
పిల్లవాని ముఖంబు పెంకయిపోయె
కన్నుల యందలి కాంతి నశించె
ఊపిరి వచ్చుచు నుండెఁ గష్టమున.

వైద్యుఁడు లోనికి వచ్చు నప్పటికి
ఎగిరి పోవుచునుండె ని ల్లేవ్వతోడ!

# మేఘదూతము

శప్తుఁడైనట్టి యక్షుహృత్సారసంబు-
శ్రావ్య గంభీరనాదుండు జలధరుండు
కామరూపుండు గగనమార్గంబు వెంట
మిత్ర కార్యార్థియై వడి మెఱయ వెడలి
పాంథవనితల స్వాగతం బందుకొనుచు
అచలముల నధ్వఖేదంబు నణఁచుకొనుచు
నిర్మల జలంబులను బొజ్జ నింపుకొనుచు
శ్రేష్ఠ దేవతాసేవలు చేసికొనుచు
వివిధరమ్య పురమ్ములు వేడ్కఁ గనుచు
దుర్గమారణ్యములలోనఁ దూఱిదూఱి
వన నదీశైల రమ్యమౌ వసుధఁ గడచి
కిన్నరేశుని కైలాసగిరిని జేరి
పిదప అలకాపురంబుఁ బ్రాపించి, యందు
విరహాతనుతన్వి యక్షుని ప్రియను జూచి
ఆత్మభూషణ రాహిత్య మంది వన్నె
తఱిగియున్న తన్మానస సరసి నాఁటి-
మరల వికసింపఁజేసె.

ఊమాన్య చరిత

స్థూల దిఙ్నాగు దూఱు చాతుర్యరీతి
సరస నిచుళునిఁ బొగడెడి సరళవిధము
కాముకత్వాభి వర్ణన గౌరవంబు
రమ్య గంగాప్రవాహ ధారాళవాక్య
నతిశయోక్తిని వర్ణింప నలవి కాదు.
ధన్యుఁడవు నీవహోహో కాళిదాసుకవి !

## మైనారిటీ వెళ్ళినరోజున *

తల్లి కడుపును వెడలు టాదిగఁ
జల్ల నౌతలఁపులు దలంచుచు
వెళ్ళఁ బుచ్చితి నిన్ని దినములు
పిల్లవాఁడనుగా !

మేలిబంగరు శృంఖలంబులు
పూల తోఁటయె బందిఖానా
పాలకులు నామిత్రవర్యులు
మేలు కూర్చితిని.

నిండుటామని గంతు లిడితిని
మండు టెండలు తేజ మొసఁగెను
పండువెన్నెల మేను మఱచితి
నిండు హర్షమున.

సలిలధారలఁ దృప్తిఁ జెందితి
అలసపవనుఁడు సుఖము నింపెను
ప్రళయసూచనఁ బోయె మదిలో
మలిన మది యెల్లన్ !

లోక సంస్మృతి కలదొ లేదో
యేక్రమంబున మెలఁగుచుంటినొ
లోకు లేమని తలఁచుచుండిరొ
నాకు లే దెఱుక !

భేద మొందదు నాస్వభావము
ఆదినారంభంబు నుండియు
ఈ దరిద్రపు జగము దృష్టిని
భేదమై పోతిన్ !

# స్వాగతము

కోరు ఫలములు మెక్కెడి కీరములును
వలయు పల్లవములు మెక్కు పరభృతములు
అఖిల దేశంబులఁ జరించు నంచపిండు
వచ్చు గీతాలు పాడెడి పక్షిగణము
మనసు గల పూల ముద్దిడు మధులిహములు
పూనుచో నాటలాడు మందానిలుండు
ఎగిరి బెదరుచూచుచు గంతు లిడుమృగాలు
గలిగి చంద్రికాహాస సల్లలిత ప్రకృతి
విమల కాసార వనఝరీ విభ్రమమున
స్వేచ్ఛతో దివ్య సమ్మదావేశ మైన
జగతిలో నందుకొ మ్మిదే స్వాగతంబు !

# ఎడఁబాటు

ప్రేమ ! నీతోడ నైక్యంబు నొందుకంటె
నధిక మధురిమ గల దెడఁబాటునందు !
ఓ ప్రణయశాలి, ఐక్యసుఖమ్ములోన

సునిశితం బగు హృదయ మహత్త్వదశను
పొందఁ జాలక యెడఁబాటు ననుభవించి
దానినే పల్కుచున్నావు మధురిమ యని
ఏమి మధురిమ కల దెడఁబాటునందు ?

హృదయ మహిమానుభవము, మహోదారమైన
నూత్న సుఖ మిచ్చె నది, కాన మధుర మంటి.
మధురమే కాకపోయిన మరల మరల
మనసు తత్స్మరణమ్ము వాంఛింపఁ గలదె ?

# ప్రణయ గీతిక

ప్రియుఁ డెప్పు డిటు వచ్చి
స్వయముగాఁ గే లిచ్చు !

పరమైత్రి నా ప్రేమ
మఱపు గనినాఁ డేమొ !

రానె రా కున్నాఁడో
రా నెంచుచున్నాఁడో

అనుచు నాస్థితి దెలియ
కనుకొనుచు నున్నదియొ !

నా కుచ్చుల రుమాలు
పై కుట్టునో పూలు !

పదే పదే ననుఁ దలఁచి
నిదురించునో కలఁత !

నన్ను స్వప్నంబులోఁ
గ న్నెత్తునో కాంచ

న న్నుచటఁ గానమిని
కన్నీరు విడుచునో !

ఎటు లామె దుఃఖమ్ము
నిటనుండి పాపుదును !

ఏ మోము పెట్టుకొని
ఆ మోము చూచెదను !

నన్ను మన్నింపవే నాప్రియురాల !
నను ప్రేమతోఁజూడు నాకంఠమాల !

# అంపకాలు

పిచ్చియో వెఱ్ఱియో నిన్నుఁ బెంచినాము
పుట్టినది మొదలీ పదుమూఁడు నేండ్లు
మున్ను విడనాడి యుండలే దెన్నడయిన
ఏగతి వియోగమును సహియింతు మింక
సెలవు వేడుచు నున్నావె చిన్నితల్లి !

అమ్మ నేదైన నడుగ సిగ్గగును నీకు
అచట మీయత్తగారి నెట్లడుగఁ గలవొ
ఆమెయును నిన్నుఁ బ్రేమించు నమ్మవలెనె
పోయి రావమ్మ మాయమ్మ పోయిరమ్మ !

అక్కయును నీవు నిక్కడ నొక్కమాటె
యుండుట తటస్థపడు నెప్పుడో గదమ్మ !

నీగృహంబున కే యిపు డేఁగుచుంటి.
నిన్నుఁ జూడగ నపుడప్డు నాన్న వచ్చు
కన్నులను వేడి నీలాలు కార్చకమ్మ !
వెళ్ళుచున్నావె మాతల్లి వెళ్ళిరమ్మ !

# మృగతృష్ణ

అది యెడారి; కన్నెత్తి యేవంకఁ గన్న
ఇసుకయే కాని వేఱొండు కానరాదు.

మట్ట మధ్యాహ్న మయ్యెను, భాస్కరుండు
ఉజ్జ్వలద్యుతిఁ జూడ నుదగ్రుఁ డగుచు
ద్వాదశాహస్కరుల ప్రతాపాతిశయము
నొక్కఁడే సేకరించె నన్పించుచుండె.

మారుతోత్థిత నానాసువర్ణధూళి
స్తంభరూపంబు నంబుదాకృతిని దాల్చి
యెగయుచుండెను మింటికి నడుమ నడుమ.
జీవనరసంబు లెండిపో వీఁచునట్టి
పశ్చిమానిలు గాఢ ఝుంఝూస్వనంబు
కాక వేఱొండు శబ్ద మావేళయందు
ఆస్థలపుశాంతి భంగం బొనర్ప దెపుడు.

అచ్చెరువు దోప నచ్చోటినుండి నేఁడు
వచ్చుచున్నది జనుల కోలాహలంబు.
కవచ సంఘర్షణ జనించు లోహరవము

ఇసుకలోఁ బాదరక్షల నీడ్చికొనెడి
వింత నిస్స్వనమును వినవచ్చుచుండె.
వేయిమంది పదాతులు బార్లుదీరి
మౌనముగఁ బోవుచుండిరి స్థలమునందు
కాలుచున్నవి చెమ్మటల్ కాయములను
వడలుచున్నవి పెదవులు దాహమునను
గోఁజుచున్నార లాయాస భరముచేత
సూర్యభగవాను కోపాన సోలినారు.
దాహమో దాహమో మాకు దాహ మనుచు
అఱచుచున్నవి నాల్కలు నోళ్ళయందు.
అంత సేనాధిపతి దాహదీనముఖుఁడు
పల్క యత్నించి పెదవులు చప్పరించి
మార్గదర్శకుఁ జూచి వచించె నిట్లు:
“పీకుకొని పోవుచున్నది నాల్క యిపుడు
భటులు బడలిరి, కోరుచున్నారు నీరు.
నీవు చూపెద నన్న జలాశయంబు
ఎప్పటికి వచ్చు, నెంతదూరాన గలదు ?”
అనెడి సేనాధిపతితోడఁ బలుకు వాఁడు:
“దేవరా, కోసు వెన్కఁ జెప్పితిని గాదె
ఆఱుకోసులు కలదంచు నచటనుండి ?

ఇంక నున్నది ఐదు కోసుల యెడమ్ము."
వాని వంకకుఁ దల ద్రిప్పి నాయకుండు
వెంటనె సమీపదేశమునందు వాని
కన్నులకుఁ గానఁబడెను బ్రవాహ మొకటి
నీళ్ళయులివును విన్నట్లు తలఁచె నతఁడు.
ఆతురతఁ గ్రొత్తశక్తి జనింపఁ బలికె :
"ఐదుకోసులకడ నీరు కలదటంచు
పశ్చిమంబుగ మమ్ముఁ గొంపోయె దేల ?
మోసగింపగఁ దలఁతువా యోరి దుష్ట !
చూడు మల్లదె ! దక్షిణ దిక్కునందు
మర్మరధ్వానమున సెలయేఱు పాఱు !"
వెంటనే వారి దృష్టు లావైపు మరలె
స్వచ్ఛజల పూరితప్రవాహంబు వారు
కాంచి యుద్దానియులివు నాలించినారు.
ఒక్కపెట్టున వారల నడుమనుండి
మోస మనుమాట రయమున నుప్పతిల్లె.
త్రోవ చూపెడివాఁ డటువైపు చూచి
సైనికుల తొందర నెఱింగి జాలిపొంది
చిన్నినవ్వు వెలార్చె నాననమునందు.

ఏది సెలయేఱు, చూపుఁడీ ! యంచుఁబల్కి
'మర్మరధ్వాన మెటనున్న ?' దంచు నడిగె.
'మోసపోకుఁడు తొందరపడకుఁ!' డనెను.
ఇంక నేమియొ పల్కి నామాట లెల్ల
సైనికుల 'మోస !' మనుధ్వని నణఁగిపోయె,
"దుష్ట, నవ్వేదు— మోసగించెదవె మమ్ము ?
నీర మున్నను నిచట లే దంచుఁ బలికి
దాహమున మమ్ము నెల్లరఁ జంపఁ జూతె ?
కనుల యెదుటనె మోసగించెదవె" ? యనిరి.

ఎంత మరలింపఁ జూచెనో యంత కంత
వీరభటులెల్ల నుద్ధతక్రోధు లయిరి.
దాహదీనుండు సేనాధిపతియు వారి
దక్షిణంబుగ నడువ నుత్తరువు చేసె.

మోస మనియెడు మాటలు బోరు కలఁగె
ఖడ్గములు కొన్ని యొండఁ దళ్కుమనియె
ఎగిరి పడియెను గీలాలసిక్త శిరము.
సత్పథము చూపువాని మస్తకముఁ దనువు
వేఱు వేఱయి పడిపోయి యిసుకఁ గలిసె.

మనసు సంక్షోభ మొంద దాహాతురమున

ఏటి వంకకు భటులెల్లఁ బరువులిడిరి.
అంతకంతకు దప్పియు నతిశయిల్ల
పెడచెవిని బెట్టి సేనాధికారి యాజ్ఞ
యోధులెల్లరు నియమిత స్థలులు దప్పి
పరుగు లెత్తగఁ జొచ్చిరి సరభసముగ.
ఇసుకలోఁ బాదరక్షల నీడ్చికొనుట
మిగుల దుర్భరమై తోఁచె; నెంత చనిన
మొదటి దూరమునందె యుండెను ఝరంబు
అతిశయించుచునుండెను దాహబాధ.
మర్మరధ్వని శ్రవణముల్ చొచ్చుచున్న
కనుల యెదుటనె సెలయేఱు గాంచుచున్న
వేయి భటుల సమూహమం దొక్కఁడైన
మధుర జలమును ద్రావగాఁ జాలఁడయ్యె
ఆయెడారిని విడి బైటఁ బడగలేదు.
ముందు వానికి వెనుక నున్నట్టివాని
కందఱికి నేఱు మొదటి దూరమ్మునందె
కానవచ్చుచునుండె సమానముగను !

# వీరమాత

డాలుతోడఁ గాక డాలుపైఁ జనుదెంచు
మంచుఁ బ్రియులతోడ నాత్మజులకుఁ
బల్కు యుద్ధమునకుఁ బంపెడి స్పార్టను
స్త్రీలుగూడ నిట్టు లేడుతు రౌరా!

అని విదేశి యొకఁడు తనదారిలోఁ వంత
నగలు నొక్క వృద్ధవనితఁ గాంచి
వాని విన్నవృద్ధ మానిని తన యేడు
పించు కాపి శిరసు కొంచెమెత్తి,

నీవు క్రొత్త యిటకుఁ గావలె నెఱుఁగవే
ఎపుడు డాలుతోడ నేఁగు దెంచు
సుతుఁడు బ్రాసిడాసు మృతినొందు టాజిలో
నెఱిఁగి దానిఁ దలఁచి యేడ్తు ననియె.

ఏమి, బ్రాసిడాసు నిటువంటి తల్లియూం
పెంచి పెద్దజేసె! వింత యయ్యె
గ్రీసులోన సముఁడు లేని శూరాత్మునిఁ
గన్న నీ కికేమి కావలయును?

ఎపుడు యుద్ధభూమి కేఁగె సేనానియై
యపుడె విజయకాంత యతని దయ్యె.
అట్టివాని కిట్టి దర్మమా మృతి కాదె
దేశసేవ నని విదేశి పల్కె.

పిచ్చివాఁడ నాకుఁ బ్రియసుతు డొక్కఁడే
వేఱు లేరు యుద్ధభూమి కిల్లు
దేశసేవ కంప: దీనికై విలపింతు
ననుచు నిశ్వసించె నప్పుడామె.

# ఏయసు

గ్రీకులును ట్రోజనులును దాత్కాలికముగ
చేసికొన్నట్టి సంధి యాదినముతోడ
నంతమగు, రేపు యుద్ధమారంభమగును.
గ్రీకువారలు మృతవీర దేహములను
గౌరవముతోడ ఖననం బొనర్చి జ్ఞాప
కార్థముగ నాటపందెముల్ సల్పినారు.
అందు వీరాగ్రగణ్యుఁడౌ ఆకిలీసు
శవము నతికరుణంబుగాఁ దగులఁబెట్టి
అస్థులను వాని ప్రియమిత్రునస్థిచయము
గలిపి హేమపాత్రికతోఁ యందుఁ బెట్టి
దానిని సమాధిలోఁ బూడ్చి దాని మీఁద
దూరమున నుండి కాన్పించు దిమ్మె గట్టి
పైన నెత్తైన రాతికంబమ్ము నాఁటి
ఘనముగా గౌరవించి; రాటలను గూడ
పెద్ద యెత్తునఁ జేసిరి. వీరవరులు
పందెముల కెంద తెందఱో వచ్చినారు.

ముందుకొందఱు శ్రోష్ఠరథాలు దెచ్చి
యొకరి మీఁదొకరుక్కరు నడిపించినారు
మల్ల యుద్ధ ప్రవీణత చూపి రంత
పరుగుపందెము లంతట జరిగెఁ బిదప
బల్లె మేయుట చక్ర ప్రయోగమందు
నేర్పు చూపిరి తమ తమ నేర్చినట్లు.
తుదకు బాణప్రయోగ చాతుర్యరీతి
నొక్క రొక్కరుచూపి. రీదినమునందు
కన్న యుద్భుత శౌర్య ప్రదర్శనంబు
గ్రీకువీరులు తమదేశములకు నేఁగి
యపుడు తమ మనుమల కటఁ గథలుగాను
జెప్పి, రప్పుడు పిల్ల లాగ్రహముతోడ
వినెడు వా. రంతగొప్ప దీదినపుఁ జర్య.
జరిగె నిటుసూర్యునస్తమయంబు వఱకు
అక్కిలీసు తల్లి యంత నందందు గెల్పు
గన్నవారికి బంగారు గిన్నియలును
వెండి గిన్నెలు మఱి మఱి విలువ గలుగు
వస్తువు లొసంగి మిగుల బహూకరించె.
పిదప నాయమ గ్రీకుల సభకుఁ బిల్చి
వారి యెదుటను దనసుతు నక్కిలీసు

దివ్యకవచంబు నాయుధంబులను బెట్టి
స్ఫుటముగా నెల్లరును విన నిట్లు పలికె
ఈ కవచమును నాయుధంబుల ధరింప
నర్హుఁడెవ్వఁడొ నా ప్రియసుతుని శవము
శత్రువుల బారిఁ బడక రక్షించె నెవడు
అతఁడె యివి పొంద ముందుకు వచ్చుగాక!
ఇట్లు పల్కఁగ రజతపాదాల థెటిసు
కలవరంపడు గ్రీకుల నడుమ నుండి
ముందునకువచ్చి రిర్వురు వీరవరులు
ఇద్దరును నర్హులే బహుమానమునకు.
దీర్ఘ దేహుఁడు దృఢకాయుఁ డతిబలుండు
ఏయసు టెలామను సుతుండు గ్రీకులందు
నిరుపమ పరాక్రముం డరిభీకరుండు;
అతనితోఁ బోలకున్న నత్యంతవీరుఁ
డసమధీరుం డకుంఠిత విక్రముండు
మంత్రి బోధన గ్రీకులం దగ్రమూర్తి
వృద్ధ లార్టిసు కొమరుఁ డొడిస్సియస్సు
'అర్హుఁడను నేనె' యంచు ముందఱికిఁ జనిరి.
"మునుపు హెక్టరుతో ద్వంద యుద్ధమందు
కీర్తి బొందితి. హెక్టరే నాబలంబు

పొగడె, విడిపోవునపుడు మే మొండొరుల ము
స్నేహచిహ్నముగా బహుమానములను
మార్చు కొంటిమి, నాకిచ్చె నతఁడు కత్తి
వెండి పిడిది; విరోధులు మన పడవల
కగ్ని తగిలింప నుంకించు సమయమందు
వరుసఁ బండ్రెండుగురు యోధవరులఁ జంపి
నిడుద జట్టు గ్రీకులను రక్షించినాను.
ట్రోజనులు పాట్రక్లిసు శవమును హరింపఁ
బోరు సమయాన నేను జూపిన ప్రతాప
మెల్లరకుఁగూడ విశద; మారోజు కాదె
ఈఒడిస్సియసు నరులు చుట్టుముట్ట
సాయమై ప్రాణరక్షణ చేసినాను;
అక్కిలీసుశవంబు నొడిస్సియసున్
తీసికొని పోవుచుండగాఁ గోపమునను
ట్రోజనులు గుంపులై వెంబడింప వారి
నడ్డగించినవాఁడను నేనె కాదె ?
ఇంక నయ్యాయి చోటుల నుగ్రముగను
నా ప్రతాపము చూపించినందు కిచటఁ
గూడియున్నట్టి గ్రీకుల కనులె సాక్షి !
చూడగా రాదె రూపంబు, నాదు పొడవు

బాహుబలమును బరుల కెవ్వరికిఁ గలవు ?
నేను బహుఙ్ఞానమును బొంద నర్హతరుఁడ.
ఇమ్ము "నా" కని ఏయసు ముందు బలికె.
నిజము నిజమని యఱచిరి గ్రీకులెల్ల
నేర్పుతోఁ బల్కె నవల ఒడిస్సియస్సు.
"చాలమాటలతో నవసరము లేదు.
హెక్టరు పరాక్రమించిన దినమునందు
నృపతి యెగమిమ్మను భయంబుతోడ 'మనము
పాఱిపోవుద' మనిచెప్ప వలదటంచు
నడ్డగింపక యేయున్న, నెన్నొసార్లు
తగునుపాయంబు దెలిపి రక్షింపకున్న,
ఎపుడు రణమున ముందుండి సైనికులకు
నూత నోత్సాహ మేనె యీకున్న యెడల
ఏమి యైయుండునో గ్రీకుసేనయెల్ల !
మాయవేషంబుతో ట్రాయి పురము చొచ్చి
'ట్రాయి పురలక్ష్మి' నధిక కష్టంబుతోడ
నేను దొంగిలి తెచ్చిన మీఁదఁ గాదె
ట్రోజనుల గెల్తు మనెడి ధైర్యంబు కలిగె ?
కానిచో నెంత బల మున్న శక్య మగునె ?
శాత్రవులలోన జొచ్చి సాహసముతోడ

ఆకిలీసు శవం బెత్తికొనుచు వేగ
నిచ్చటికిఁ దెచ్చి ప్రోచిన దేను గాదె?
నేనె యర్హుఁడ నీబహుమాన మొందఁ!"
ఇదియునుంగూడ గ్రీకులు నిజమె యనిరి.
తలఁపని తలంపుగా బహుమానమునకు
తనకుఁ బోటీ మఱొక్కఁడు నిలుచుటయును
ఆతనింగూడ గ్రీకులు పొగడుటయును
తెలియ, ఏయసు మానసం బుగ్రమయ్యె
ఒడ లెఱుంగక యాతఁడు పలికె నిట్లు:
"ఓడిస్సియసూ, నీవు నాయెదుటనె
తగుదునంచును దలయెత్త సాహసింతె?
యుద్ధమున శత్రువులచేతఁ జావకుండ
నిన్ను రక్షించినది యెల్ల మఱచినావె?
పట్టిటక్కులవాఁడ, ఏ వెన్నిమార్లు
పిఱికివై పాఱిపోతివో జ్ఞప్తి లేదె?
హెక్టరు ముసలినెస్టరుమీఁదఁ బడఁగ
నతని రక్షింప నినుఁ బిల్వ హెక్టరునకు
వెఱచి మాటాడకుండఁ బర్విడగ లేదె?
హెక్టరును ద్వంద్వయుద్ధంబునం దెదిర్చు
వారు లెండన లేచినవారియందు

ఉ

తుదకు లేచినవాఁడవు నీవె కాదె?
నిర్భయంబుగ నేను నాయోడలెల్ల
నొక్కచివరను నిల్పితి; నీవు నీవి
భయముతో నిల్పినావు మధ్యంబునందు
'ట్రాయిపురలక్ష్మి' దొంగిలించుటయుఁగూడ
నీవొక పరాక్రమంబుగా నెంచినావె?
దొంగిలింపగఁ బోవునే వీరభటుఁడు?
యుద్ధభారంబు నేనె భరించుచుండ
నందుఁ జేఁ జేసికొనరాక ఆకిలీసు
శవముఁ జేకొనిపోయి యాకీర్తినెల్ల
నీదిగాఁ జెప్పికొనుచుంటి వేమి తెలివి!
మోసగాఁడవు, పందవు దుర్బలుఁడవు
దొంగ వత్యల్పదేహుండ వీవు నాకు
సరిసమానుండవే? వెన్కఁదిరిగి పొమ్ము!"
ఏయసుని పల్కులను విని కుపితుఁడగుచు
"వ్యర్థవాదంబు నాకేల మోటువాఁడ!
పిఱికివాఁడనో ధీరుండనో యెఱుంగ
ట్రోజనులు యోగ్యతము, లడుగంగవచ్చు
నిచట ఖైదీలుగా నున్నట్రోజనులను.
ప్యాట్రొక్లిసు చన్నయపు డాటపందెములను

నీకు నాకును మల్లయుద్ధంబు జరిగె
కావునను నీకె యెఱుక నాబాహుబలము!"
అనుచుఁ బల్కె ఒడిస్సియ సుగ్రీముగను.
గ్రీకువీరాగ్రగణ్యు లిర్వురును నిట్లు
ప్రబల వాదంబు చేయుచుండుటను జూచి
కలవరంపడఁ జొచ్చిరి గ్రీకులెల్ల.
అపుడు నిలియసు సుతుఁడు నెస్టారు లేచి-
గ్రీకులం దెల్ల వృద్ధుఁడు, వాని యెదుట
మూఁడుతరముల వారు గతించి చనిరి
మిగుల ననుభవశాలి వివేకమూర్తి-
చెప్పగాసాగె: "ఓ గ్రీకువీరులార,
ఆత్మ ప్రేరేపణలఁ జెప్పుచుంటి వినుఁడు
పాడురో ఇది. గ్రీకుల శ్రేష్ఠతములు
వంతుగా నిల్చి రీబహుమానమునకు
ఇందు గెల్వనివాఁ డెంత నొచ్చుకొననో!
ఇంకపయిఁ బూర్వవిధమున మనలకొఱకు
ట్రోజనులతోడఁ బోరాడఁ బోఁడు, కాన
గ్రీకులకుఁ జాలనష్ట మూహించుచుంటి.
వారిగుణలోపముల్ విమర్శనము చేయ
నర్హుఁ డొకఁడైన నీ గ్రీకులందు లేఁడు.

ఏయనే శ్రేష్ఠుఁడంచు నొక్కఁడు వచించు
ఒకనికి ఒడిస్సియస్సె నుత్తార్హుఁ డగును
ఎవరి యిష్టము చొప్పున వార లందఱి
పట్టువడినట్టి ట్రోజనుల్ కొంద ఱిపుడు
పశువులను మేలిబంగారు కంచు నినుము
నిచ్చి విడిపించు స్నేహితుల్ లేమిఁజేసి
ఇచట మనయొద్ద నున్నారు. వారు మనల
నందఱను నేకరీతి ద్వేషింతురి కానఁ
బక్షపాతము చేయరు. వారె యిపుడు
న్యాయమును జెప్ప నర్హు లీ గ్రీకులందు
శ్రేష్ఠుఁ డెవ్వఁడొ, యెవ్వఁడు ట్రోజనులకు
నధికహాని యొనర్చెనో తెలు నిట్లు."
ఇట్టు లన్న నెస్టారు వివేకమునకు
మెచ్చుకొనుచు నుతించిరి గ్రీకు లతని.
అంత ట్రోజనులను వారు సభకుఁ బిల్చి
నడుమ న్యాయాధిపులుగఁ గూర్చుండఁ జేసి
"ఎవ్వ రర్హులో తెల్పుఁడీ" యని యడిగిరి.
వారిముందున కేయ సొడిస్సియసులు
వచ్చి వేర్వేరఁ దమతమ నేర్పు బలము
చూపిన పరాక్రమంబు ప్రవర్తనంబు

చేసినట్టి మహాద్భుత కార్యములును
స్పష్టముగఁ జెప్పికొనిరి. ట్రోజనులుఁగూడ
మిగుల యోజన చేసి ఒడిస్సియస్సె
శ్రేష్ఠుఁడని పల్కి రైకకంఠ్యంబుగాను
బాహుబలమునఁ ఏయసు శ్రేష్ఠుఁడైన
సాటికాఁ డన్నిగతుల ఒడిస్సియసుకు.

సంతసంబునఁ బొంగె ఒడిస్సియస్సు
పిడుగు పడినట్టులయ్యె ఏయసుని మదిని.

థెటిసు ప్రార్థనచే అకిలీసు కొఱకు
దేవశిల్పి హిఫాస్టసు చేసినట్టి
ఐదుమడతల డాలును (దానిమీఁద
చిత్రముగ బొమ్మలెన్నొ వ్రాయంగఁ బడియె.
భూమియు నభంబు సంద్రము చంద్రుఁ డినుఁడు
వ్రాయఁబడె; ఒక్కపురమందుఁ గలకల మని
జనులు తిరుగుచునుండి; రింకొక్క చోట
పెండ్లిపాటలు పాడుచున్నారు ప్రజలు
ఇర్వు రొకచోటఁ బోరాడుచున్నవారు
ఇంక నొక పట్టణమునందు ఘోర యుద్ధ
మొకటి జరుగుచునున్న; దింకొక్కచోట
పొలము దున్నుచునుండిరి; వేఱుచోట

మేయుచున్నవి పశువు లానందమునను;
ఇట్టిబొమ్మలు దానిపై నెన్నొకలవు)
బొమ్మతగడును మిక్కిలి మెఱయుదాని
వెలపొడవు భారమా శిరస్త్రాణ మొకటి
బల్లెమును ఖడ్గమును బహుమాన మిచ్చి
ఛేటిసు కడుగారవించె నొడిస్సియసును.
గ్రీకుసైనికు లెల్ల మామూలు వలెను
చప్పటలతోడ మోదము చూపలేదు,
జాలిపొందిరి ఏయసు స్థితిని జూచి.

౨

పిడుగడచినట్టు లైన ఏయసుని కనులు
మీఁది కార్యక్రమముఁ జూడలేకపోయె.
దేహమున రక్తమెల్ల మోమునకుఁ బాఱ
మాటలాడక కదలక నిలిచె నతఁడు
అంత స్నేహితు లాతని చుట్టుఁ జేరి
ఓర్పుమాటలు చెప్పుచు మెల్ల మెల్ల
నతనిని గుడారమునకుఁ దీసికొని చనిరి.
అచట ఏయసు కూర్చుండె నిశ్చలముగ
తినుటకును ద్రాగుటకుఁ దోఁచలే దతనికి
ఇంతలో సాంధ్యరాగ మదృశ్య మయ్యె
గ్రీకు శిబిరంబు గప్పెను గాఢతమము
కాని ఏయసు కూర్చున్నయటనె యుండె
కలఁత నొందుచునుండె నాతని మనస్సు.
‘‘ఇన్ని దినములు గ్రీకులకొఱకు నేను
చూపిన పరాక్రమం బంత వ్యర్థమయ్యె.
నన్ను మించెడి వాఁ డొక్క- అకిలీసె

తప్ప లేఁ డెవ్వఁ డని తృప్తినొందుచుంటి
ట్రోజనులు గ్రీకువారు నన్యాయముగను
ఉత్తముఁ బొడిస్సియస్సని చెప్పినారు.
పిఱికివానికి బలహీనునకును వారు
కీర్తి యెల్ల నొసంగిరి. యుద్ధములను
ముందుగా నిల్చి పోరాడుచుండు నాకు
కీర్తి యేమియు లేదు. నా సాహసంబు
నా ప్రతాపము శక్తియు వ్యర్థమయ్యె!"
అనుచుఁ గష్టమునే తలపోయుచుండ
కష్ట మంతటఁ గోపంబుగాను మాఱె.
"పక్షపాతము చేసిరి గ్రీకువారు
మోసగించె ఒడిస్సియస్, వారి నెల్ల
నాశమొనరించి కసి దీర్చుకొందు" ననెను.
"గ్రీకుల గుడారముల నెల్లఁ దగులఁ బెట్టి
శిక్షచేసెద" నంచుఁ దలంచె మొదట.
"కాని, గ్రీకుల నెల్లరఁ జంపి వేయ
లాభమేమిటి ? వారేమి చేసినారు ?
గ్రీకు ముఖ్యులు చేసి రన్యాయ మెల్ల
మోసగించిన వాఁడె ఒడిస్సియస్సు
వారినే చంపవలె"నంచుఁ దలఁచెఁ బిదప.

అంత హెక్టరు బహుమాన మిచ్చినట్టి
వెండిపిడిఖడ్గ మొరనుండి పైకి లాగి
తనగుడారము వెలువడి తీవ్రముగ ను
గ్రీకు ప్రముఖులఁ జంపగాఁ బయనమయ్యె.
కోపదేవత యాతని నాశ్రయించె
వెడలె నాతని విడిచి వివేకమపుడు.
గ్రీకు శిబిరంబులోన జేరుటకుమాఱు
వార లాహారమునకయి చేర్చియున్న
గొఱ్ఱె లున్నట్టి పచ్చికబయలు చేరె.
శాంతరసము ముఖంబులఁ జిందుచుండ
పెరిగియున్నట్టి యున్నితో సుందరముగ
పచ్చపచ్చిక గొఱుకుచు నొకటి నొకటి
పిలుచుకొని గడ్డిరుచిఁ దెల్పుకొనుచునున్న
వానివలె గొఱ్ఱె లఱచుచునుండె నచట.
చెడిన ఏయసు మతికి నాగొఱ్ఱె మంద
గ్రీకుముఖ్యులుగాఁ దోఁచె; నొకరినొకరి
పేరున నుబిల్చి గ్రీకులఁ బ్రతిఫలంబు
ననుభవింపు మటంచుఁ గోపంబుతోడ
ఒక్కటొక్కటిగా గొఱ్ఱెల నువధించె.
తుదకు నొకపెద్ద పొట్టేలు గాంచి దాని

"ఓ ఒడిస్సియుసా దొంగ!" యంచుఁ బిలిచి
తిట్టి కసితోడ నేమేమియో వచించి
ముందుగా ముండ్లకఱ్ఱతో మోఁది మోఁది
కసి శమించినమీఁద ఖడ్గంబు దూసి
పొడిచి నఱకెను దానిని వివిధగతుల.

అంత బడలిక యవయవంబుల జయింప
అటనె శయనించి యాతఁడు నిదురవోయె.
ప్రాణులకుఁ దెల్వి నొసఁగు మార్తండుఁ డవల
తూర్పుదిశఁ దోఁచి, బంగారు కిరణములను
లోకమెల్లను వెలిగించి మేలుకొలిపె.
కనులు నులుముచు ఏజాసు నిదుర లేచె.

ఒక్క రక్తసరోవరంబం దతండు
పండుకొనినట్లు తనచుట్టు గొఱ్ఱె లెన్నొ
చచ్చిపడియున్నయట్లు గ్రహించె నపుడు
వెంటనే రాత్రిసంగతి జ్ఞప్తివచ్చె.
"మూఢమతి నాఁచు గ్రీకు లటంచు నెంచి
గొఱ్ఱెమందను జంపితి!" యని వచించి
చెప్పలేనంత సిగ్గు తన్నాశ్రయింప
తన్ను క్షణమైనఁ దాఁ జూచుకొనగలేక

హెక్టరొసఁగిన ఖడ్గంబు భూమిఁ బాతి
దాని యగ్రంబునం బడి యంత మొందె.
కొంతసే పైనపిమ్మట గ్రీకు లతని
దుర్మరణవార్త నెఱిఁగి యత్యంతముగను
శోక మొంది రావీరాగ్రగణ్యుకొఱకు.
అంతట ఒడిస్సియసు వచియించె నిట్లు:
"ఇంతటి విపత్తు ఘటిల్లు నంచు నాకుఁ
దెలిసియున్నచో నీబహుమానమునకు
పంతమాడియె యుండను. ఇప్పుడైన
ఈమృత సుయోధు ప్రాణముల్ వచ్చునేని
కవచ మాయుధములను నే విడిచిపైతు !"

# ఈనను

ట్రాయిపట్టణ కుడ్యభాగముల నిల్చి
కోట రక్షించుచున్న ప్యారిసు సుధన్వి
శతువిషబాణవిద్ధుఁడై తచ్చికిత్స
నేఁటిగియున్నట్టి ఈననువద్ద కరిగె.

ప్యారి సతిసుందరుఁడు ట్రాయిరాజసుతుఁడు
పెండ్లియాడెను మొదట ఈనాను సాధ్వి.
ఆమెతోఁ గొన్నినాళ్ళు సుఖించి దుష్ట
దైవచోదిత హృదయ ప్రచారుఁ డగుచు
గ్రీకు నృపభార్య జగదేకసుందరాంగి
హెలెను రమణిని వంచించి యుపహరించి
స్వీయపురి నామెతోడ సుఖించుచుండె.

ఈన నాతని కెన్నో నీతులను జెప్పె
కాని మార్గంబు పట్టితి వని వచించె
తీఁగవలె వానిమోకాళ్ళు కౌఁగిలించి
తగ దటంచును బ్రార్థించి చెడుదు వనెను.

ఏమిచెప్పిన వినఁడాయెఁ జెడెడువేళ
చేరుటంజేసి. క్రూరుఁడై తుదకు నతఁడు

వెడలి పొమ్మంచు నామెఁ బరాభవించె.
మానినీమణి ఈనను తత్పరాభ
వమున భర్తపై నుద్భటక్రోధ యగుచు
పట్టణము వీడి దుర్గమారణ్యమందు
వాస మొనరించు; నొకవేళ విధిని దూఱు
భర్త నిందించుఁ దన్నుఁ దాఁ దిట్టుకొనును.
హృదయమార్దవ మడుగంట ముదుగువస్త్ర
ములను ధరియించి కాఁపువారలను గలిసి
తిరిగి యాడుచుఁ బ్రొద్దులు పుచ్చు నామె.
కోమలాంగవర్ణము పూలతోడఁ గలిపి
విహగయువతుల పాటలతోన తనదు
దుష్పరాభవ గీతికల్ పాడుచుండు.
ఇంతలో నటఁ గుపితుఁడై గ్రీకురాజు
చండసేనాన్వితంబుగా దాడివెడలి
ట్రాయికోటను విడువక ముట్టడించె.
కడచెఁ దొమ్మిదివర్షముల్ పదియు వచ్చె
ఇరుతెగలఁ గూలి రెందఱో దండిమగలు.
చాపముం గేలఁగొని ప్యారిసాఖ్యుఁడు
కోట గోడలపై నిల్చి గ్రీకుసేన
ఘనశరాసారమువను జెండాడుచుండ

నొక కఠోరనారాచ మాకస్మికముగ
దక్షిణకరంబునందు గాఢముగ నాఁటె.
దానిఁ బరికించి దిగ్ధం బటంచు నెఱిఁగి
"ప్యారిసూ, ఆలసింప కీనానుకడను
సర్వవిషముల నుపసంహరింపఁ గలుగు
మందు మంత్రంబు లున్నవి: ఏఁగు మటకు"
అనెను జేరువ నున్న మిత్త్రుం డొకండు.
పెండ్లియై యామె విడనాడి యుండునైన
తాను బల్కిన కఠినవాక్యములనైన
ఆమె కొనరించిన పరాభవంబునైనఁ
దలఁపగా లేదు, స్వప్రాణరక్షణంబె
తలఁచె నత్తరి ప్యారిసు మూఢుఁడగుచు.
తనకుఁ దప్పక యనురాగవంతురాలు
సాధ్వి ఈనను చేయుఁ జికిత్స యనుచు
నామెవాసంబునకు నేఁగి దీనముగను
విషము పోఁగొట్టు మనుచుఁ బ్రార్థనము సల్పె.
"ఓప్రియా, నన్ను క్షమియింపు వేఁడుకొందు !
దుష్పథంబునఁ బోతిఁ దత్ఫలము వచ్చె !
ఇంక నీమాట జవదాటకుందు నెపుడు
కలయఁ బ్రాకెడి విషబాధ యంగకముల

నన్ను విషముక్తుఁ జేయుమా !'' యనె నతండు.
ఆమె వెనుకటి ఈనను కాదు నేఁడు.
తనకుఁ గల్గిన యవమాన భరముచేత
కుసుమ సుకుమార దేహము వజ్రమయ్యె.
వానిమాటల కీనను ముఖమునందు
మందహాసము నటియింపఁ బలికె నిట్లు:
"అవసరం బుండు నందాఁక ప్రియనె నీకు ?
సుఖదినంబుల నీసహభాగిని యగు
కాంతయే నిన్ను విషముక్తుఁ జేయుఁగాక,
ఆమె సన్నిధి కేఁగుము:—తడయ కిచట !''
ఎంతయో ప్యారి సామెను వేఁడుకొనియె
నిష్ఫలంబయ్యె వాని ప్రయత్న మెల్ల
కఠినలోహంబులుంగూడఁ గఱఁగఁ గలవు
పర్వతంబులుగూడఁ గన్నీరు కార్చు
కాని ఈనాను హృది దయారసము కనదు.
ప్రియుని ప్రార్థనములఁ బెడచెవిని బెట్టి
అతనిఁ జూచుచు దుర్భర మనుచు నెంచి
యామె చేరువఁగల నగాగ్రంబు చేరె.
ప్యారి సామెను రమ్ము రమ్మంచుఁ బిలిచి
ఈననూ, ఈననూ యంచు, గలవరించి

శాంతిఁ బొందె విషోత్కట బాధచేత.

అచటి గోపాలు రంతట ముండ్లఁ బుంల
మోహనం బగునొక పెద్దచితిని జేర్చి
జాలితో గౌరవంబుతో దానిమీఁద
వాని మృతదేహముం బెట్టి యగ్నిహోత్రు
రవులు గొల్పిరి, వాయువు వీవఁదొడఁగ.
సుందరాకారు నొక్కని మ్రింగితినని
పొగను జాలించి యగ్నియు భగ్గుమనియె.
భగ్గు మన్నట్టి యగ్నికారణ మెఱింగి
ఎదుటి గిరి నున్న ఈనను హృదయవీథి
భగ్గు మనియెను దాపపరీత మగుచు.

తాపభరమున లోహముల్ కరగురీతి
కరిగె నీనను హృది శోకతాపమునను.
"అయ్యొ, దుష్కోధకలుషితహృదయ నగుచు
చేతులారంగఁ బ్రాణేశుఁ జంపుకొంటి !"
అనుచుఁ జితిఁజేరి యందులో దుమికె నామె.

ఇదియు రెండవకబళ మీదినమునందు
ప్రథను కబళము కంటెను రుచిర మనుచు
తృప్తితోడను మండె హుతాశనుండు!

# జర్జీసు

౧

నిరుపమ వైభవాన్వితుఁ డుజ్జ్వలుండు
జర్జీసు పారసీ సార్వభౌముండు
గ్రీసు దేశము గెల్చి గ్రీకులమీఁద
మునుపటి కసి దీర్చుకొను నింపుకోర్కెఁ
బృథివి మున్గానని పృథుసంఖ్య గల్గు
వేర్వేరు సైన్యముల్ వెంటఁ దీసికొని
నౌకా దళంబు సైన్యంబు నేకముగఁ
గలిసి పోరఁగ వీలు కలుగంగఁ గూర్చి
రాజధాని సుసాపురంబునం దుండి
జైత్ర యాత్ర యొనర్ప సాగె. మార్గమున
సామంతు లంపిన సైన్యంబు లింకఁ
గూడ వచ్చుచునుండెఁ, గూడి యన్నియును
లెక్కింపగా వీలులేనిది యయ్యె.

ఒకచోటఁ బదివేల యోధుల నుంచి
చుట్టును గిరిగీసి కట్టి గోడొకటి
ఆవరణంబునం దమరెడివారి
గుఱ్ఱపు గుంపులు గాఁగఁ గూర్చి పోసియు
ఒంటులు నూటయెబ్బది మూఁర్లు చనిరి
చనినార లెనిమిది సారు లాశ్వికులు
ఇంకను మిగిలినా రితర సైనికులు
సేవకుల్ వనితలు చిన్నపిల్లలును.
విండ్లును గండ్రగొడ్డండ్లు ఖడ్గములు
గదలు బల్లెంబులు కరవాళికలును
ఇంత వాహినియును నేటికి గ్రీసు
పైకిఁ బిచ్చుకమీఁద బ్రహ్మాస్త్రమట్లు!
ఇటు గ్రీసు మీఁదికి నేఁగు జర్క్సిసు
'ఫ్రిజియాను' దన 'సాట్రిపీ' చొచ్చి యందు
చేరినాఁడు సెలేనె పేరింటి పురము
అచ్చోటనే యాఁగె నన్ని సేనలును.
ఆపారశీక రాజ్యంబందు నెల్ల
సమధిక సంపన్నశాలి యం దుండు
పితియసు. వానికిఁ బిల్ల లైదుగురు.
తన సార్వభౌముని ఘనగౌరవమున

చేరగాఁ జని పూజచేసి యామీఁద
నాతని సైన్యంబు నాపట్టణమున
నాగురోజులు వారి కగుకర్చులెల్ల
పితయనే భరియించి విభునకు మిగుల
సంతోషముగా గూర్చె. చక్రవర్తియును
ఆదరంబునఁ బిల్చి యతనికి ధనము
కల దెంతయో యది తెలుపఁ బ్రశ్నించె.

"సార్వభౌమా, మహాసంస్తవనీయ
మీపాద భృత్యుఁడ మీసమక్షమున
నేపాటి వాఁడనే! నీసేవకునకు
నలువది లక్షల నాణెంబులకును
వేలేడు తరు" గంచు పితయను పల్కె.

వెంటనే జర్జిసు ప్రీతాత్ముఁ డగుచు
తన ఖజానానుండి తగ్గుగా నన్న
ఏడువేల్ డోరకు లిప్పించి వాని
ధనపు సంఖ్యను నిండుదానిగాఁ జేసె.

అంత నాపురి వీడి యరిగి సార్డిసుకు
తన యైదుగురు పుత్రులను వెంటరాగ
వెను వెంటనే యేఁగె పితియను గూడ.

సార్డిసులో రాజు చలికాల మొల్లఁ
గడపె. నంతట యుద్ధకాలంబు రాగ
ఒక్కఁడైనను వెన్కనుండ కెల్లరును
యుద్ధంబునకుఁ బోవ నుత్తరు వొసగె.
ప్రథమంబు కంటెను వర్ధిల్లియున్న
జనపతితోఁ దనచనవు పాటించి
విభుఁడు పైఁజూపిన ప్రీతి గణించి
భయభక్తి సంభ్రమ బాధితుం డగుచు
మందహాసము ముఖమందు వ్రేలాడ
చక్రవర్తిని జేరఁ జని పితియస్సు,
“రాజమహారాజ, రాజాధిరాజ
నీకీర్తి నిండె నిఖిల దిక్కులను
ఈ చిన్న దాసుని యీచిన్నమనవి
ఒక్కటే యాలించి యొనగూర్పు దేవ!”
అనిపల్క రారాజు నతనిఁ గన్నెత్తి
వీక్షించె; నంతట పితియ సిట్లనియె:
“నాసుతుల్ దేవ యున్నార లైదుగురు
ఏను వారలుగూడ నీయుద్ధమునకు
వచ్చుచున్నారము—వచ్చుట తిరిగి
యెప్పుడో చెప్పగా నెవ్వరితరము?

కావున నాగృహకార్యముల్ చూడ
జ్యేష్ఠపుత్రుఁ డింటనే యుండునట్లు
నిలిపియుఁ బార్థింపఁ జేరితి వి మ్ము!
సాహసంబును దేవ, క్షమియింపవలయు!"
అని పితియసు పల్క నణఁకువతోడ
నప్పుడే క్రోధోగ్రుఁ డయ్యె జర్జ్సు.
"బానిసీనికి నింత భయవిహీనతయొ?
కావరంబొ నీచసేవకు కింత?
వెంటనే యీయల్పు పెద్దకునూరు
రెండు ఖండములుగాఁ ఖండించి, మనము
తరలెడి యీ కోట ద్వారంబునందు
రెండ నైపులఁ గట్టి రం!" డంచుఁ బలికె.
జర్జ్సు సేనలు సాగగాఁ జొచ్చె
ముందుగా ఘోషమ్ము పుట్టె ఘోరముగ.
మెల మెల్లగా సైన్యములు చేరవచ్చె
పట్టణద్వారంబు. వారి కన్నులకు
నటఁ గానవచ్చిన దగ్రసంపన్న
జ్యేష్ఠపుత్రుని ద్విధాచ్ఛిన్న దేహంబు.
శబ్దశూన్యము లయ్యె సైన్యంబులెల్ల
ఒక్కఁడు నోరెత్త నోపలే దపుడు.

సార్డిసులో రాజు చలికాల మెల్లఁ
గడపె. నంతట యుద్ధకాలంబు రాఁగ
ఒక్కఁడైనను వెన్కనుండక కెల్లరును
యుద్ధంబునకుఁ బోవ నుత్తరు వొసఁగె.
ప్రథమంబు కంటెను వర్ధిల్లియున్న
జనపతితోఁ దనచనవు పాటించి
విభుఁడు పైఁజూపిన ప్రీతి గణించి
భ[illegible]క్తి సంభ్రమ బాధితుం డగుచు
[illegible]ందహాసము ముఖమందు వ్రేలాఁడ
చక్రవర్తిని జేరఁ జని పితియస్సు,
"రాజమహారాజ, రాజాధిరాజ
నీకీర్తియే నిండె నిఖిల దిక్కులను
ఈచిన్న దాసుని యీచిన్నమనవి
ఒక్కటే యాలించి యొనగూర్పు దేవ!"
అనిపల్క రారాజు నతనిఁ గన్నెత్తి
వీక్షించె; నంతట పితియ సిట్లనియె:
"నాసుతుల్ దేవ యున్నార లైదుగురు
ఏను వారలుగూడ నీయుద్ధమునకు
వచ్చుచున్నారము—వచ్చుట తిరిగి
యెప్పుడో చెప్పఁగా నెవ్వరితరము?

కావున నా గృహకార్యముల్ చూడ
జ్యేష్ఠపుత్రుఁ డింటనే యుండునట్లు
నిలిపియుఁ బ్రార్థింపఁ జేరితి నిమ్ము!
సాహసంబును దేవ, క్షమియింపవలయు!"
అని పిరియను పల్కు నణఁకువతోడ
నప్పుడే క్రోధోగ్రుఁ డయ్యె జర్జిసు.
"బానిసీనికి నింత భయవిహీనతయె?
కావరంబె నీచ సేవకు కింత?
వెంటనే యీయల్పు పెద్దకునూరు
రెండు ఖండములుగా ఖండించి, మనము
తరలెడి యీ కోట ద్వారంబునందుఁ
రెండ వైపులఁ గట్టి రం!" డంచుఁ బలికె.
జర్జిసు సేనలు సాగగాఁ జొచ్చె
ముందుగా ఘోషమ్ము పుట్టె ఘోరముగ.
మెల మెల్లగా సైన్యములు చేరవచ్చె
పట్టణద్వారంబు. వారి కన్నులకు
నటఁ గానవచ్చిన దగ్రసంపన్న
జ్యేష్ఠపుత్రుని ద్విధాచ్ఛిన్న దేహంబు.
శబ్దశూన్యము లయ్యె సైన్యంబులెల్ల
ఒక్కఁడు నో రెత్త నోపలే దపుడు.

సార్వభౌముని మహోచండ శాసనము
కల్గించె వారికి గాఢసంభ్రమము!
చనుచునే యుండెను సైన్యంబు లెల్ల.

౨

చని చని జర్క్సీసు సైన్య నిర్ఝరిణి
వారాశితీరంబుఁ జేరె. నచ్చోట
సంతరింపగవలె జలసంధి యొకటి.
రాజునానతి దాఁట రత్నాకరంబు
శిల్పశాస్త్రజ్ఞులు చేరి యోజించి
ఎంత తుపానుకే నిది యాఁగుననుచు
బలము కల్గిన యట్టి పడవలతోడ
కట్టినారొక పెద్ద గట్టి వంతెనను.
సంద్రము దాఁటగా జరిగె యత్నములు
వెనుక వైపుననున్న వీరు లెల్లరును
కారణం బెఱుఁగక కలగుండు వడిరి.

ఉత్సాహకుంఠన మొంది రారాజు
వృత్తాంత మెఱుఁగ నాశ్వికుఁ బంపె నొకని.
నురుగులు గ్రక్కఁగాఁ బరుగెత్తఁ జేసి
తన శ్రేష్ఠ సైంధవంబును గంటలోన
వార్తావహుఁడును వచ్చి క్రమ్మఱను,
"సార్వభౌమా, విను, చనిన రాతిరిని
సింధుదేవత లెల్లఁ జేరి గర్వమున
మును పెన్నఁడెఱుఁగని ఘనవాయువులను
పంతాన లేచిరి పాథోధియందు.
లేచు కొండలవంటి వీచీసమూహ
తాడనంబునకును దాళగా లేక
పడవలు వంతెన భగ్నమైపోయె
దాని చిహ్నంబైనఁ గానరా దిపుడు!"
అని విన్నవింపగా నది విని రాజు
ప్రభువుకార్యము నజాగ్రతమెయిఁ జేసె
అపకీర్తి దెచ్చిన యధమ శిల్పులను
ఖండించి వేయగాఁ జండశాసనము
నలిపి యామీఁదట సాగరంబునకు
తనదు నాజ్ఞాపత్రమును వినిపించి
మూఁడువందల సార్లు తాడన మొసఁగ

నాజ్ఞ గావింపగా నట్టులే జరిగె!
స్వయముగా జర్జీసు వచ్చిచేయించె
తనదు రెండవ యాజ్ఞ తప్పకుండంగ!
సంధ్య యయ్యెను శిక్ష సాగునప్పటికి
కెంజాయ లింకను క్షీణింపలేదు.
పున్నమి యగుటచేఁ బుట్టె చంద్రుండు
ముద్దాడుచుండె సముద్రుఁ గేల్గొనల.
అప్పుడొక సేవకుం డబ్ధిని జేరి
ప్రభ్వంకముద్రిత పత్రంబు విప్పి,
"ఎన్నడు నీకెగ్గు నేవిధంబునను
చేయకుండిన పారశీ చక్రవర్తి
కార్యంబునకు నీవు గడుసుదనాన
విఘ్నంబు గావించి విశదంబు గాగ
భయద దండన కిప్డు పాత్రంబవైతి!
ఇఁక మీఁద నీకెవ్వ రీభూమిజనులు
అర్పింప రొక కాన్క యైన. నీ విపుడు
మున్నూరు తాడనంబుల నందుకొనుము!"
అని వినిపింగా నర్ణవం బపుడు
హోరున మిన్నంట నుఱికెను. భటుఁడు
క్రూరమౌ నొకపెద్ద కొరడాను దీసి

పైకెత్తి దానితో బలముకొలంది
సాగరంబును మోదె. సాగరం బపుడు
ఘోషించుచును ముందుకుం బోయె వెను.
వెండియు భృత్యుండు విడువక మోదె
తిరిగి తరంగముల్ దరిసెనేకాని
సింధువుపై నింత చిహ్నంబు లేదు.
అనునిముషంబును నధికమౌచున్న
సాగర ఘోషంబు సంతసంబునను
వినుచు నుప్పొంగుచుం జనియె జర్క్సు.
వెంట వెంటనె పడు వీచులతోడ
అల్లకల్లోలమై యర్ణవం బఱచె!

# వెనుకటి పద్యములు కాల్చి

రూపుమాత్రపుఁ బూలెన్నొ రూపుమాసి
పోయిననె కాని పిందెపూల్ పుట్టఁబోవు;
పిందె లెన్నియొ నాశంబు నొంది గాని
పూర్ణఫల మొండు నిలవఁగాఁ బోదు లతను.

వాతవశమునఁ జిందఱవంద ఱగుచు
నభ్రశకలమ్ములు తొలంగి నంత మీఁద
నమృతధారలు చిల్కు మేఘములు నిలుచు.

బలిమి సేనాముఖంబున నిలుచు భటులు
వీరనాకంబు నొందిన వెనుక గాక
సంగరంబున సంపూర్ణజయము లేదు!

# యాత్ర

అలలవేగము తెప్పఁద్రోయుము
చూడఁ బడవను వశీకరింపుము
పడవ నడుపు తృణీకరింపుచుఁ
బ్రకృతి ఘనశక్తిన్ !

అబ్ధి యెంతగభీర మైనను
అందుఁ దేలగఁ దెప్ప యున్నది
పడవ యొరగదు పడవ మునఁగదు
పడవ పగులనిది.

అలల నడుమను నిరికి నప్పుడె
కలదు కొంత కెక్కుడంగ ధైర్యము
ఎంతపెద్దతుపాను వచ్చిన
మనసు కల దోర్వన్.

పడవ నడుపుచు నలసిపోయిన
నడపు మని నీతోడి నావికు
ప్రొద్దు పుచ్చుము పాట పాడుచు
నాట లాడుచును.

# టిప్పణములు

నీరో పాట: నీరో క్రూరుఁడగు రోమను చక్రవర్తి. అతని ప్రభుత్వకాలమున రోముపురమున గొప్ప యగ్ని ప్రమాదము సంభవించెను. దానికి నీరో కారకుఁడని కొందఱు తలఁచుచున్నారు. రోము మండుచున్న సమయమున సంగీతప్రియుఁడగు నీరో తన ప్రాసాదగోపురము మీఁదికిఁ జని పాట పాడినట్లు వాడుక గలదు.

సీజరు: రోమను చక్రవర్తుల బిరుదు.

వీరమాత: డాలుఁ మీదఁ గాక ........ గెలిచినవాఁడు ప్రతియోధుని డాలు గ్రహించి వచ్చును; మృతినొందిన యెడల వాని యనుచరులు డాలుపై నైచి వానిని మోసుకొనివత్తురు.

ఏయసు: ఇతనినే ఎజాక్సుకూడ నందురు.

సాట్రపీ: పూర్వము పారసీకరాజ్యములో నొకభాగము మన దేశములో పరగణావంటిది.

డోరిక్: ఒకనాణెము.

# ప్రథమ పాదానుక్రమణిక

 ప్రథమపాదానుక్రమణిక



శ్రీ త్రిపురసుందరీ ముద్రాశాల : తెనాలి